Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU





VOL. V BEZWADA—JUNE 1936 No. 6

# భీమా పత్రిక

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ., ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఏ. ఎస్.

„ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. యె., బి. యల్.

సంపాదకుడు: సూర్యంపూడి కనకరాజు పంతులు.


## భీమా పత్రిక

“భీమాపత్రిక” ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందుగా చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోష్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు: మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

**BUSINESS NOTICE.**

**The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.**

**The annual subscription is Rs. 2/- inclusive of postage Single copy costs 4 annas Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors**

**For particulars —The Manager, "Bheema Patrica" Bezwada (S India),**

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు “భీమాపత్రిక” అను పేరుదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత........................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాను.

బెజవాడ,
తేది 29—6—36.

మేనేజరు.
భీమా పత్రిక.




# భీమాచట్టసవరణ

## (Insurance Law Amendment)

## I

ఇండియాప్రభుత్వపు లా మెంబరు సర్ నృపేంద్రనాథ్ సర్కారుగారు యీనెల (జూన్) చివరవారములో బొంబాయిపురమునకు వచ్చి యుండిరి. వీరిరాక బొంబాయివర్తకప్రముఖులలో కొంత యలజడిని కలిగించెను. హిందూదేశకంపెనీల వ్యాపారస్తులలోను, విదేశకంపెనీల వ్యాపారస్తులలోను ప్రముఖులగువారు కొంతమంది వారిని సందర్శించి యిండియన్‌కంపెనీల యొక్కయు, హిందూదేశ భీమాకంపెనీల యొక్కయు, చట్టసవరణలనుగూర్చి సంభాషణలను జరిపినట్లు వార్తలు తెల్పుచున్నవి.

హిందూదేశ భీమాకంపెనీల చట్టములోని లోపములనుగూర్చియు అవుసరమగు సవరణలను గూర్చియు విచారణలుసల్పి ఇండియాప్రభుత్వమువారికి తెల్పుటకు నియమింపబడిన స్పెషల్ ఆఫీసరు శ్రీయుత సేనుగారు తమ విచారణలను ముగించి తమ సిఫార్సులతోనొక నివేదికను ప్రభుత్వమువారి కిదివరకే పంపినట్లు తెలియుచున్నది. సేనుగారి నివేదికలోని విషయములను పరీక్షించుటకు ప్రభుత్వమువారు ఒక ప్రత్యేక సంఘమును ఏర్పాటు చేసెదరట. ఆక్టులో చేయబడు సవరణలు యీనూతనముగ నేర్పాటుచేయబడు కమిటీవారి సిఫార్సులపై ఆధారపడి యుండును. ఈ ప్రత్యేకసంఘుసభ్యు లెవరో తెలియదు వారిపేర్లు ప్రకటించి యుండలేదు. ఈసంఘము యొక్క యోగ్యత, అధికారవిస్తీర్ణత ముందు తెలుపబడునేమో!

నూతనముగ ఏర్పాటు చేయబోవు ప్రత్యేక సంఘము వారియొక్క నివేదిక వచ్చిన తర్వాత గాని యీలోపుగ ప్రభుత్వమువారు భీమాచట్టసవరణబిల్లును అసంబ్లీలో ప్రవేశపెట్టరని తలంపవచ్చును. ప్రభుత్వము వారియొక్క యీ నూతన విధానము వలన నూతన భీమా చట్టమును అమలులోనికి తెచ్చుటలో చాల కాలయాపన జరుగునని హిందూదేశ భీమాకంపెనీలవారు భీతిల్లుచున్నారు. రాబోవు బడ్జెట్టు సెషనులో ప్రభుత్వమువారు భీమాచట్టసవరణబిల్లును ప్రవేశపెట్టవచ్చును. అట్లు ప్రవేశపెట్టి ప్రత్యేకసంఘ విచారణకు రిఫరుచేసిన యెడల 1987 సం॥రం అగస్టు, సెప్టెంబరు సెషనులోగాని, లేక 1988సం॥

బడ్జెట్ సెషనులోగాని యీబిల్లు అసంబ్లీవారి తీర్మానమునకు వచ్చును.

చాల కాలము క్రిందట స్థాపింపబడి మంచి స్థిరత్వముతో గూడిన విదేశపుకంపెనీల పోటీయును యోగ్యతా యోగ్యతలతో నిమిత్తము లేక కుక్కగొడుగులవలె మితములేక బయలుదేరు నూతనకంపెనీల స్థాపనయు హిందూదేశ భీమావ్యాపార సక్రమాభివృద్ధికి ప్రతిబంధకములుగనుండుటచే హిందూదేశ భీమాకంపెనీలవారును భీమాచట్ట సవరణ బిల్లును త్వరలో ప్రవేశపెట్టవలసినదిగ కోరుచున్నారు. రాబోవు అసంబ్లీ సభలో అధికారేతరసభ్యు లెవరైనను ప్రయివేటు బిల్లును ప్రవేశపెట్టినయెడల ప్రభుత్వమువారు దానిని త్రోసివేయకుండ హిందూదేశ భీమాకంపెనీలవారు ప్రయత్నింపవలెను.

ఈ సందర్భములో ఒకవింత విషయమును ముఖ్యముగ గమనింపవలసియున్నది ఈనూతన భీమాచట్ట సవరణబిల్లును ప్రవేశపెట్టు సందర్భమున నూతనసవరణలవలన హిందూదేశములో తమవ్యాపారమునకేవిధమైన నష్టముగలుగకుండచూచుకొనుటకు మంచి పలుకుబడి గల కొంతమంది విదేశపుకంపెనీల ప్రతినిధులుగూడ యిండియాకు వచ్చియుండిరని తెలియుచున్నది. వారు, అన్నిభీమావ్యాపార సంస్థలవారిచే నియోగింపబడిన ఒకప్రత్యేకసంఘము లండను నగరములో తయారుచేసిన ఒక విజ్ఞప్తిని ప్రభుత్వమువారికి పంపినట్లు గూడ తెలియుచున్నది. కాని ఆవిజ్ఞప్తిలోని విషయములు ప్రకటింపబడియుండలేదు. ఈరహస్యపత్రములో మూడు విషయములను ముఖ్యముగా సూచించియుండురు. హిందూదేశములో భీమావ్యాపారము చేసేవారు స్వదేశ వ్యాపార సంస్థలవారైననుసరే విదేశ వ్యాపార సంస్థలవారైననుసరే ఎవరి ఎడలను పక్షపాతముంచక జాతి మత భేదములతో నిమిత్తములేక ఎవరికిని ప్రత్యేక సౌకర్యములు చూపక ప్రభుత్వమువారు అందరిని సమానముగ చూడవలసినదనే విషయము ఒకటి. విదేశ కంపెనీలలో భీమాచేయించిన పట్టాదార్ల హామీ నిమిత్తం యిండియాలో ప్రత్యేక హామీడిపాజిట్లు ఉంచవలసిన అవుసరము లేకుండునట్లు చేయవలసినదనేవిషయము రెండవది. విదేశపు కంపెనీలు తమనిధులనుపెట్టుబడిచేయుటలో ఏవిధమైన ఆటంకములును, షరతులును పెట్టకుండునట్లును బ్రిటిషు యిండియాలోనున్న భీమాకంపెనీల చట్టమునకులోబడి పనిచేయు కంపెనీలు స్వదేశ సంస్థానములలో పనిచేసేయెడల అట్టిస్వదేశ సంస్థానములవారు ఎట్టివిధములైనన్యాయచట్టములచేనాటంకములుకలుగజేయకుండునట్లును చేయవలసినదనే విషయముమూడవది.

విదేశపు భీమాకంపెనీలవారు హిందూదేశములో తమ వ్యాపారమునకు నష్టము లేకుండునట్లు తగు సౌకర్యముల కొరకును, స్వదేశభీమా సంస్థలవారు విదేశపు కంపెనీలయొక్కయు నూతనముగ స్థాపింపబడు స్వదేశభీమా సంస్థలయొక్కయు పోటీ లేకుండ తమ వ్యాపార సక్రమాభివృద్ధి నిమిత్తము తగు సౌకర్యములకొరకు స్వలాభాపేక్షతోగట్టి ప్రయత్నములను చేయుచున్నారేగాని అహర్నిశములు మిక్కిలి కష్టపడి కంపెనీలకు వ్యాపారమును తెచ్చియిచ్చు ఏజంట్లకు చేయవలసిన సౌకర్యములను గూర్చి ఒక్కరును యోచించుచున్నట్లు గాన్పింపదు.

“మనము ధనికులము. సామంతులము. ఏజంట్లు కూలీలు, వీరికి సౌకర్యములతో నిమిత్తము లేదు.” అని కంపెనీలవారిభావన. కంపెనీలవారు

ఏజంట్లకు తగు సౌకర్యములను చేస్తారనే మాట సర్వముకల్ల. ఏజంట్లకు సౌకర్య విషయములో ప్రభుత్వమువారిచే చట్ట రూపేణ కంపెనీల వారిపై వత్తిడి కలుగజేసిన గాని కంపెనీలవారు ఏజంట్లకు తగు సౌకర్యములను చేయరు. అవులును, అవులును (స్వదేశీ, విదేశీ భీమాసంస్థలు) కుమ్మక్కొని మధ్యలేగల (ఏజంట్లు) కాళ్లను విరుగగొట్టకుండిన నంతియ చాలును. ఈసందర్భములో ఏజంట్లుకూడ తమ సౌకర్యములకొరకు తామే గట్టి ప్రయత్నములను చేయవలెను. ఈ సమయముననే ఏజంట్లకష్టములను వారికి చేయవలసిన తగు సౌకర్యములను గూర్చి విచారణ సల్పి ప్రభుత్వమువారికి తెలియపర్చుటకు ఒక సబ్ కమిటీని కూడ నేర్పాటుచేసి యీసవరణ చట్టములోనే కంపెనీలవారు ఏజంట్లకు చేయవలసినసౌకర్యములను గూర్చి నిబంధనల నేర్పాటు చేయవలసినదని ఏజంట్లు ప్రభుత్వము వారిని కోరవలసియున్నది. ఆంధ్రదేశములోగల భీమా ఏజంట్లు ఎవరి ప్రదేశములలో వారు వెంటనే ఒక్కచో సమావేశమై తమ కష్టములను గూర్చియు, తమకు కంపెనీలవారు చేయవలసిన వసతులను గూర్చియు తీర్మానముల రూపమునప్రభుత్వమువారికి వెంటనే తెలియపరచుట ఉత్తమమనినలహానిచ్చుచున్నాము. ఏజంట్లకు తగిన వసతులను హిందూదేశ భీమా కంపెనీలవారికి తగినరక్షణములు ఏర్పాటు చేసినగాని భారతదేశ భావిభాగ్యోన్నతికి ప్రధానమగు భీమావ్యాపారముహిందూదేశములో సక్రమాభివృద్ధిని పొందనేరదనేవిషయము ప్రభుత్వమువారు గ్రహించి ధర్మమైనట్టితగుఏర్పాటులను గావించెద రని నమ్ముచున్నాము.

---

## II

# గ్రేట్ యిండియా ఇన్సూరెన్సు లిమిటెడ్ - కలకత్తా

## Great India Insurance Ltd., Calcutta.

కొలది మాసములనుండి యీ కంపెనీవారికి వ్యతిరేకముగ కొన్ని గాలివార్తలు ప్రబలియున్నవి. కలకత్తాలో ప్రచురింపబడు కొన్ని యింగ్లీషు భీమాపత్రికలలో యీసందర్భమున ప్రకటింపబడిన కొన్నివార్తలనుగూడ చూచియున్నాము. ఈసమయమును అవకాశముగ గైకొని ప్రతిపక్షులైన కొంతమంది ఏజంట్లు, యీవిషయమునుగూర్చి తెలుసుకొనుటకు తమయొద్దకు వచ్చిన భీమాపట్టాదార్లనుదుర్బోధనలతో బెదరగొట్టుచున్నట్లు వినుచున్నాము. ఈవిషయములో యింగ్లీషు భీమాపత్రికలు వ్రాయు వ్రాతలు చాల అసమంజసములుగ నున్నవి. కారణమేమనగా వీరు యీభీమాసంస్థకుచేసిన అపకారముకన్న ఏమియు తెలియని భీమాపట్టాదారులకు ఎక్కువ అపకారమును చేసియున్నారు. ప్రతికక్షులలైన ఇతరకంపెనీ ఏజంట్లు స్వలాభాపేక్షతో యీకంపెనీ పట్టాదారులను, ఇతర భీమావ్యాపారాభిమానులను యీకంపెనీ యెడల విముఖత్వము గలిగించి తప్పుత్రోవలను త్రొక్కించుచున్నారని వినుటకు చాల విచారముగ నున్నది.

ఈవిధముగ ప్రవర్తించు ఏజంట్లు తాము ప్రాతినిధ్యము వహించి పనిచేయు భీమావ్యాపారమునకే ఎక్కువ అపకారము చేయుచున్నట్లే తలంపవలసియున్నది. నిష్పక్షపాత బుద్ధి

కోను ప్రశాంతముగను ఆలోచించి ఒకవేళ యిట్టి లేనిపోని వాదుకలకు గూడ స్థానమిచ్చి వాదుకలోనున్న గాలివార్తల నన్నింటినినిజమని తలంచినప్పటికిని ఇదివరలో ప్రచారములోనున్న వాదుకలను గూర్చి యీకంపెనీ పట్టాదారులు ఏవిధముగను భయపడుటకు ప్రబలకారణములు లేవని నమ్ముచున్నాము.

ఈకంపెనీని మరియొక కంపెనీలోకలిపి వేస్తారనే గాలివార్త ప్రబలముగా వ్యాపింపచేయబడుచున్నది. అట్టి కలిపివేయుసందర్భములో యీ కంపెనీ పట్టాదారులయొక్క పట్టాకంట్రాక్టుషరతులను యీకంపెనీనితమలో కలుపుకొనే కంపెనీవారు నెరవేర్పరనిఏమియు తెలియని యీకంపెనీ పట్టాదారులకు ప్రతికక్షులైనఏజంట్లుదుర్బోధలను చేసిభయపెట్టుచున్నట్లు తెలియుచున్నది. ఈ విషయములో యీ కంపెనీపట్టాదార్లు ఎట్టిభయమును కలిగియుండ నవసరములేదు. ఒకవేళ యీ కంపెనీని మరియొక్క కంపెనీలో కలిపివేసే మాటే నిజమై కలిపివేయబడినప్పటికిని యీకంపెనీ తనపట్టాదారులకు యివ్వవలసిన ఋణబాధ్యతలను చెల్లింపలేని స్థితియందున్నదని తలంచుటకు వీలులేదు. పాశ్చాత్య దేశములలో, కలిపివేతలు (ఒకకంపెనీని మరియొక్క కంపెనీలోనికి కలిపివేయుట) సామాన్యము. చాలకాలము క్రిందట స్థాపింపబడిన బలమైన కంపెనీలు గూడ మరింత బలముగా నుండుటకు యిట్టి కలిపివేతల కాశించుచుందురు. హిందూదేశములో విరివిగా వ్యాపారము చేయుచున్న నార్తుబ్రిటిషు అండ్ మర్కెంటైల్, యులయంజు అండ్ స్టట్ గార్డరు, సన్‌లైఫ్ మొదలగు కంపెనీలే యిందులకు తార్కాణములు.

ఒక కంపెనీని మరియొక కంపెనీలో కలిపివేసే సందర్భములో కంపెనీయొక్క ఆస్తిఅప్పుల విలువ మదింపు మిక్కిలి కాఠిన్యముతో వేయబడి అమలులో నున్న పట్టాలకు తగిన దామాయిషా నిధుల మొత్తముతో కంపెనీఆస్తి ఇలా కంపెనీని కలుపుకొనుటకు సిద్ధముగానున్న మరియొక్క కంపెనీకి వప్పగింతచేయబడును. ఇట్టి సందర్భములలో ఒక కంపెనీని తమలో కలుపుకొనే కంపెనీవారు అ కంపెనీయొక్క పట్టాదార్ల పట్టాషరతులను చెల్లింపక తప్పదు

మేము యీమధ్య చెన్నపట్టణము వెళ్లిన సందర్భమున యీకంపెనీయొక్క మదరాసు బ్రాంచి సెక్రటరీగారిని చూచుట తటస్తించెను. మాటల సందర్భములో వారు పైవిధమునసూచించినట్లు యీకంపెనీ ఆస్తి, అప్పుల విలువ మదింపువేయబడుచున్నదనియు, కంపెనీవారు షేరుహోల్డరుల వద్దనుండి రావలసిన కొంత మూలధనమును జమచేయుటకు ఏర్పాటుచేసిరనియు తెల్పియున్నారు. ఈఆస్తి అప్పులవిలువ మదింపు ముగిసిన వెంటనే ఏమిచేయుదురో ముందు నిశ్చయించెదరు. కంపెనీవిషయములు పట్టాదారులకు తెలిసే నిమిత్తము కంపెనీవారు అప్పుడొక ప్రకటనను గావించెదరు అప్పటి పరిస్థితులను బట్టిఏవిధముగాచేసినప్పటికిని పట్టాదారులకెంత మాత్రమును నష్టముండక మరింత బలము చేకూరగలదని మాగట్టినమ్మకము.

ఏలాగున నున్నప్పటికిని అర్థాంతరముగ తెలియకుండ యీ కంపెనీకి ఎట్టినష్టము రాకుండచేసే స్వభావము యీ వ్యాపారములోనే గలదు. కాబట్టి పట్టాదారులు కొంతమంది ప్రతిపక్ష ఏజంట్లు స్వలాభాపేక్షతో చెప్పు

మాటలనువిని త్రప్పు ద్రోవలను బడక తమపట్టాలను రద్దుకాకయుండునట్లు చూచుకొనెదరుగాక యనినమ్ముచున్నాము. ఒకవేళ యీసంస్థలో గొప్ప లోపమే యున్నయెడల పట్టాదారులకు నష్టమునుగలిగించు యీలోపము జరుగకుండునట్లు వారించుటకు యుండియా ప్రభుత్వము వారి భీమాశాస్త్రవేత్త అసాధారణ అధికారమును కలిగియుండెను. పట్టాదారులకు గొప్పనష్టము సంభవించుచున్నప్పుడు యీయన చూచుచు ఊరకయుండడు. ఇట్టి సమయములలో పట్టాదారుకు తగినరక్షణ యొసంగుటకు యీయన గట్టి ప్రయత్నములు చేయును.

కావున లేనిపోని వాదుకలను గాలివార్తలను ఆధారములుగ గైకొని పట్టాదారులు తమ పట్టాలు రద్దుకాక యుండునట్లు చూచుకొందురు గాక.

---

III

## ఏజంట్ల సంఘము

### (Agents, Association)

రెండవ ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజంట్ల మహాసభవారిచే ఆంధ్రదేశ దేశీయభీమా కంపెనీ ఏజంట్లసంఘమునకు గాను చిత్తు చట్ట నిబంధనలను (Draft Constitution) తయారు చేయుటకు ఏర్పాటు చేయబడిన ఉపసంఘము వారు ఇదివరలో బెజవాడ పట్టణమున రెండు పర్యాయములు సమావేశమై 28-5-36 తేదీని ఫైనల్‌గా తమచిత్తుచట్టనిబంధనలనుతయారుచేసి పై సంఘముయొక్క మహాసభ (General body) వారికి నివేదించిరి. ఉపసంఘమువారు తమ రిపోర్టులో పై సంఘమును ట్రేడ్ యూనియన్ ఆక్టు క్రింద రిజిష్టరు చేయించవలసినదిగా తీర్మానించి మహాసభ వారికి సిఫార్సు చేసియున్నారు. వీరిచే నివేదింపబడిన చిత్తు చట్ట నిబంధనలు (Draft Constitution) స్థలాంతరమున ప్రకటింపబడెను. జూలై మాసములో ఆంధ్రదేశ దేశీయ భీమా కంపెనీ ఏజంట్ల మహాజనసభ (General body meeting) సమావేశము జరుగనై యున్నది. అప్పుడు పై సంఘముయొక్క ఉపసంఘమువారు తయారుచేసి పంపిన చిత్తుచట్ట నిబంధనలను చర్చించి తీర్మానించెదరు. ఈలోపుగ ఆంధ్రదేశములోగల భీమా ఏజంట్లు యీచిత్తుచట్టనిబంధన విషయములో తమ అభిప్రాయములను సవరణలను మహాజనసభా సమావేశమగు లోపల సదరు సంఘమువారికి పంపుట యుత్తమము. ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజంట్ల మహాజనసభవారు వెంటనే సమావేశమై సబ్ కమిటీవారు నివేదించిన యీచిత్తుచట్టనిబంధనలను అంగీకరించి సదరు సంఘమును సబ్ కమిటీవారు సూచించినట్లు ట్రేడ్‌యూనియన్ ఆక్టుక్రింద రిజిష్టరు చేయించి ఏజంట్ల కష్టసుఖములను ఎప్పటికప్పుడు కంపెనీలవారికిని ప్రభుత్వము వారికిని తెలియజేసి వెంటనే తగు సౌకర్యములను పొందుటకు ప్రయత్నించెదరని నమ్ముచున్నాము

---

# అఖిలభారత స్వదేశీ భీమాకంపెనీల సంఘం - బొంబాయి

## ఏజంట్లసంఘాలకర్తవ్యం.

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు.)

ఈ సంఘంవారు ఏజంట్లనుగూర్చి తగినశ్రద్ధ ఒకవిధంగా తీసుకుంటున్నారు. అది మంచికో చెడ్డకో యని యోచిస్తే నా ఉద్దేశంలో మంచికే అని అనుకుంటాను. ఈసంఘంవారు కూడ సదుద్దేశంతోనే యీఅంశమునుగూర్చి శ్రద్ధతీసుకుంటున్నారో లేక తమకుండే అధికారబలంతో తీసుకుంటున్నారో మాత్రం చెప్పడం కష్టము. ఏజంట్లలో తరచు కంపెనీలనుమారువిషయంలో అట్టి ఏజంట్లను గూర్చిన్ని ఏజంట్లయొక్క నడవడికలు కంపెనీ విషయంలో ఏలావుంటోందో అను విషయమునుగూర్చిన్ని ఒక లిస్టును తయారుచేయుటకున్ను కంపెనీల దృష్టిలో యీలీస్టులో మంచివారు కారన్నవారినిగూర్చి అన్ని కంపెనీలకు తెలుపుటకున్నతగు ఏర్పాట్లు జరుగుచున్నటుల తెలుస్తోంది. ఈఅంశమును గూర్చి యోచిస్తే ఏజంట్లకు యిదిమంచిదే.

దీనినిబట్టి యీవృత్తిని అవలంబించేవారు ఎంత జాగ్రత్తగా వుంటూవుండాలో తెలుస్తుంది. ఇక ఏజంట్లసంఘంవారు యీఅంశములను గమనించి వారుకూడా జాగ్రత్తపడవలసి ఉంటుంది.

అ. భా. ఏజంట్లసంఘంవారున్ను ముఖ్యంగా ఆంధ్ర దేశ దేశీయ భీమా ఏజంట్ల సంఘంవారున్ను యీవిషయమై శ్రద్ధతీసుకోవాలి. ఏవిషయంలో ననగా కంపెనీలవారు, ఆర్గనైజర్లను, చీఫు ఏజంట్లను, ఏజంట్లను మున్నగువారిని నియమించుటలోను ఆలా నియమించినవారు మానుకునే స్థితికి రావడానికి కారణములను ఏజంట్లవిషయంలోను పాలసీహోల్డర్లు విషయంలోను, ఏ యే కంపెనీ ఏలా ప్రవర్తిస్తోందో ఆ వివరాలున్ను తెలుసుకొనినపిమ్మట ఏ యే కంపెనీలకు ఏజన్సీ తీసుకుంటే మంచిదో, ఏయే కంపెనీలలో భీమా చేస్తే మంచిదో తెలుపుటకు తగిన ప్రయత్నాలను చేసుకోవలసి ఉంటుంది. ఈరెండు ఏర్పాట్ల వల్ల భీమావ్యాపారం బాగుగా నడచుటలో నూతన శక్తులు ఉద్భవిల్లుటకు పునాదులేర్పడి ముందువారికీ ఏర్పాట్లుంతో ఉపకరించగలవు.

ఈ విషయాలలో కంపెనీలస్థితి తెలుసుకోవాలంటే అధమము 6 వత్సరాలు ఏకంపెనీకైనా ఏజంటుగా పనిచేసినవానిద్వారా సులువుగా తెలియగలవు. ఆంధ్రదేశంలో పనిచేసే భీమా కంపెనీలయొక్క ఏజంట్లనుండి యీవివరాలను తెలుసుకొనుటకు ఆంధ్రదేశీయ భీమాఏజంట్ల సంఘం తగినశ్రద్ధ తీసుకొను ననినమ్ముతున్నాను.

---

# భీమాఏజంట్లు గుర్తించేవి

ఈ న్యాయశాస్త్రగ్రంథములలో రోజుకు రూపాయి ఆదాయంవచ్చే మనిషి పదివేలవరకు తన జీవితముపై భీమా చేసుకోవచ్చు నని ఉంది.

* * * *

జీవితభీమాకంపెనీలయొక్క ఆర్టికల్సు ఆఫ్ ఎసోసియేషనులో ఏజంట్లకు రెన్యూయల్సు యిస్తామనే సంగతిని కంపెనీవారు వ్రాసుకోకపోతే అట్టి కంపెనీలు రెన్యూయల్సు ఏజంట్లకు ఒకవేళ ఎగగొట్టితే ఆ ఏజంట్లు కోర్టుకు వెళ్ళినా కోర్టువారు ఆ కంపెనీయొక్క ఆర్టికల్సు ఆఫ్ ఎసోసియేషనునుబట్టి రెన్యూయల్సు యివ్వడానికి వీలు లేదని తీర్పుయిస్తారనే సంగతిని యిందుకు సంబంధించిన న్యాయశాస్త్రము చెప్తుతోంది.

శ॥ సు॥

# స్వదేశీకంపెనీలలోనే ఎందుకు భీమాచేయాలి

మల్లెల శ్రీరామమూర్తిగారు.

ఏప్రిల్ సంచికలో 'భీమా ప్రచారానికి కంపెనీలవారు పూనుకోవాలసిన అవుసరం' చర్చించబడింది. ఇప్పు డీ వ్యాసంలో దేశీయులు స్వదేశీ కంపెనీలలోనే భీమా చేయవలెననే విషయం విమర్శించబడుతూన్నది.

అసలు మానవజీవితభీమావిధానం పాశ్చాత్యులవల్లనే కనిపెట్టబడి, కంపెనీలు స్థాపింపబడి, వారిద్వారానే మనదేశంలో ప్రవేశంకావడం వల్లనూ, కొలది సంవత్సరాల క్రితంవరకు మన దేశంలో విరివిగా భీమాకంపెనీలు బయలుదేరక పోవడంవల్లనూ, మన దేశీయులు తమ జీవితాలను విశేషంగా విదేశకంపెనీలలోనే భీమాచేసుకున్నారు. క్రమేణా గత ఇరవై, ముప్పయి సంవత్సరాలనుంచి మన దేశంలో భీమాకంపెనీలు పెరిగినవి. భారతవర్షంలో 1912 వ సంవత్సరంలో ప్రభుత్వంవారిచే కట్టుదిట్టంగా భీమాచట్టం చేయబడింది. కంపెనీలసంఖ్య, భీమావ్యాపార మొత్తం, దినదినాభివృద్ధిగా పెరుగుచున్నవి. భరతభూమిలో యీనాడు ప్రముఖులైన భారత నాయకుల యాజమాన్యంలో 180 భీమాకంపెనీలు నిర్విఘ్నంగా, జయప్రదంగా, అతినిపుణతతో నిర్వహింపబడుతున్నాయి. భీమావ్యాపారసిద్ధాంతమున పాశ్చాత్యదేశములలో పట్టములు బడసి కడు సమర్థతతో భీమాసంస్థలను నిర్వహించుచున్న భారతీయ ప్రముఖులు నేడెందరో గలరు. భీమాచేసుకోవలసిన అవుసరం తెలుసుకున్నతర్వాత ఆ భీమా స్వదేశీకంపెనీలలోనే చేయాలనే విషయం తెలుసుకోవడం, అందుకై ప్రయత్నించటం చాలా ముఖ్యం. భీమాచేయడంవల్ల తనకే కాకుండా, తనదేశానికి, తనతోటి దేశీయులకూకూడా లాభం ఉందనేవిషయం గ్రహించిననాడే భీమా యొక్క యథార్థస్వరూపం భీమాచేసినవారికి తెలసినట్లని తలంచాలి. పట్టాదారులు చెల్లించే ధనం భీమాకంపెనీలవారిచే భద్రంగా ఉంచబడుతుంది. అనుభవనీయులైన భీమాసిద్ధాంతులు కంపెనీయొక్క అభివృద్ధికి పాటుబడుతారు. ప్రభుత్వంవారు ప్రతిసంవత్సరమూ భీమాకంపెనీలవ్యాపారం, లెక్కలు కఠినంగా పరీక్షిస్తూ పట్టాదారులు చెల్లించినసొమ్ముకు నష్టంరాకుండా ఎప్పటికప్పుడు జరిగిన భీమా వ్యాపారాన్నిబట్టి తగినంతధనం హామీపుచ్చుకుంటూ ఉంటారు. అటువంటి పరిస్థితిలో జీవితభీమాకంపెనీలు దివాలాతీస్తాయనిగాని, పట్టాదారుల సొమ్ము పోతుందనిగాని, అనుకోవటానికి ఏమాత్రమూ సావకాశంలేదు. భీమాకంపెనీల ఆదాయం, ఆస్తి దినదినాభివృద్ధి అవుతూ ఉంటుంది. భారతీయులంతా దేశీయభీమాకంపెనీలలోనే భీమా చేసుకుంటే మనం చెల్లించేడబ్బుఅంతా మనదేశంలోనే మన కండ్లఎదుట ఉంటుంది. మన దేశీయసంస్థల నిర్వహణానికి, మన దేశసౌభాగ్యానికి, సర్వదా ఉపయోగపడుతుంది. మనదేశఆపత్కాలంలో అక్కరకువచ్చి మన దేశసంరక్షణకు తోడ్పడుతుంది. కంపెనీలవారు పంచే లాభాలు మన దేశీయులే అనుభవిస్తారు. దేశీయభీమాకంపెనీలలో మన దేశీయులు భీమాచేసుకుంటే, మనం చెల్లించేప్రతిదమ్మిడీ మనదేశీయులే అనుభవిస్తారుగాని విదేశీయునికి

చెందదు. మనదేశకంపెనీలో భీమాచేసుకుంటే మనకండ్లతో కంపెనీయొక్క పరిస్థితిచూచుకో వచ్చును. అవుసరాన్నిబట్టి స్వయంగా వెళ్లి కంపెనీ అధికారులతో మాట్లాడి మనవ్యవహారాలు పరిష్కారం చేసుకోవచ్చును

ఇక విదేశకంపెనీలలో మనం భీమాచేసుకుంటే మనంచెల్లించే ధనమంతా ఆరు లేక ఏడు వేలమైళ్లదూరంలో ఉన్న విదేశాలకు పోతుంది. మన డబ్బులంతా విదేశీయుల హస్తగతమై వారి దేశకల్యాణానికి తోడ్పడుతుంది. లాభాలంతా వాళ్లే అనుభవిస్తారు మన దేశాభివృద్ధికి ఏవిధంగాను తోడ్పడదు. మన వ్యవహారపరిష్కార సందర్భాల్లో పేచీవస్తే మనం కంపెనీకివెళ్లి అసలైన అధికారులతో చెప్పుకోడానికి కూడా వీలుండదు. ఆ కంపెనీకి ఏజంటుగా ఉన్నవారితో మాట్లాడడం, కాగితాలమీద ఏలండనుకో, ఏకనడాకో వ్రాసుకోవడం, వారేదో వ్రాయడంతప్ప మనకేమీ ప్రత్యక్షఆధారం ఉండదు. విదేశకంపెనీకి చెల్లించే మొత్తములో ఏజంటుగా ఉన్నవారికి ముట్టే ఏ కొద్దిమొత్తమో తప్ప మిగతా ప్రతిపైసా విదేశీయులకు అనగా తెల్లవారికి చెందుతుంది. విదేశ కంపెనీల ఆస్తి అంతా 7 వేల మైళ్లదూరంలో ఉంటుంది. మనం భారతదేశంలో ఉంటాం. సామ్రాజ్య కాంక్షలతో మారణయంత్రసామగ్రులతో మునిగితేలుతున్న పాశ్చాత్యదేశీయుల కంపెనీలలో మనం భీమాచేసి మన ధనమంతా వారికి సమర్పిస్తే ఏదేశమైనా పతనమైతే దేశీయుల డబ్బంతా గంగపాలయినట్లే. ఇదీ అసలు వ్యవహారం. ఈ రహస్యం తెలిస్తే భారతీయులు విదేశకంపెనీలలో భీమాచేయడానికి అంగీకరిస్తారా యని ప్రశ్నిస్తున్నాను.

దీన్నిబట్టి సర్వవిధాలా మన దేశీయకంపెనీలలోనే భీమాచేసుకోవడం మన దేశీయులకు చాలా లాభమని స్పష్టమవుతున్నది. కాబట్టి భీమాచేసే ప్రతిభారతీయుడు యీ సంగతిసందర్భాలు ఆలోచించుకొని మనం భారతీయులం మనం భారతదేశస్థులం అనే మాట జ్ఞాపకం ఉంచుకొని స్వదేశకంపెనీలలోనే భీమాచేసి, తాము లాభంపొందటమేకాకుండా, దేశకల్యాణానికీ తనతోటి దేశీయుల అభివృద్ధికీ తోడ్పడవలెనని మనవిచేస్తున్నాను. భారతభూమిలో నేడు 180 భీమాకంపెనీలు వివిధరాష్ట్రాల్లో జయప్రదంగా, అతిసమర్థతతో, దినదినాభివృద్ధిగా దేశీయప్రముఖుల ఆధిపత్యంక్రింద పనిచేస్తూన్నా, విదేశకంపెనీలకంటె మంచి లాభాలు పంచిపెట్టుతున్నా, విదేశకంపెనీల వారు ఎలావ్యాపారం సాగిస్తున్నారు, ఎందుకు విదేశకంపెనీలలో భీమాచేస్తున్నారు, దీనికి బాధ్యులెవరు అనే విషయాలు ముందు వివరింపబడునని విన్నవిస్తూ ఈ వ్యాసం ముగిస్తున్నాను.



# ఆంధ్రదేశము - భీమాపత్రికలు

## సంపాదకుల కర్తవ్యము.

(శ్రీ శనివారపు సుబ్బారావుగారు)

ఆంధ్రదేశంలో మొదట ప్రారంభమైనది ఈ పత్రికయే. దీనితర్వాత గుంటూరులోను, చెన్నపురిలోను, రాజమహేంద్రవరములోను బయలుదేరినవి. అవన్నియు నామకార్థంగానే వున్నాయని చెప్పసాహసించుచున్నాను. అనవసరంగా యిట్టి నామకార్థపు పనులకు వ్రియప్రియాసలకు లోనగుటనుబట్టి యీ శాస్త్రమును గూర్చిన పత్రికలను నడుపుటలోనుండే బాధ్యత ఎంతవరకు కష్టమో స్పష్టపడుతోంది.

ఈ పత్రికకూడా యింతవరకు చాలా కష్టంతోనే నడుస్తోంది. ఈ పత్రికాధిపతికి యీ పత్రికారచయితవృత్తిమీద గిట్టుబాటు లేదనే చెప్పాలి. మున్ముందు గిట్టుబాటు లేకపోతుందా అనే ఉత్సాహంతో నడుపుతున్నారు. ఈ పత్రికలోకూడ యీ శాస్త్రమునకు సంబంధించిన అంశములపై సరియైనవ్యాసరాజములు ప్రచురణ కావడంలేదు. ఇందులకు కారణం మన ఆంధ్రదేశంలో యీ శాస్త్రమునుగూర్చి తెలిసినవారు బహుఅరుదు. రెండోది తెలిసినవారున్నా ఆంధ్రములో వ్రాయడం కొంచెం కష్టం. ఈ పనులకై ఎవరైనా ప్రత్యేక కాలమును వినియోగిస్తే పత్రికాధిపతులు కాగితం, సిరాఖర్చు అయినా యియ్యలేని స్థితిలో వుంటారు. ఈ శాస్త్రంపై వ్రాయాలంటే మంచిగ్రంథాలయం అవసరం. అట్టిదానిని పత్రికాసంపాదకులు ఏర్పాటు చేసుకొని తగిన అనుభవంవున్న ఏజంట్లకు ఆ గ్రంథాలను యిచ్చి వ్యాసములను వ్రాయించుటకు కృషిచేస్తే అదో కొంతవరకు బాగుంటుంది. ఈ విషయమై యిట్టిపత్రికలను నడిపేవారంతా యోచింతురుగాక !

ప్రతిఏజంటు ఇట్టిపత్రికలను కొనినపుడే ఈపత్రికానిర్వాహకులు తరచుగా కంపెనీలవారిపై ఆధారపడి వారిని పొగడడం తగ్గుతుంది. అంతవరకు యిట్టిపత్రికలను నడపువారు కంపెనీలవారి మోమోటంమీద ఆధారపడక తప్పదు అని నా భావం.

# భీమావారములు

## (Insurance Weeks)

Mr. P. R. Seshagiri Rao.

ఆంధ్రదేశమునం దంతటను ఆరోగ్యవారములు జరుగుచున్నటులనే యీ భరతఖండమునందు ప్రతిపట్టణములయందు భీమావారములు జరుపవలెను. అట్లు భీమావారములు జరుపుసమయములందు భీమాలను చేయించుటవలన కలుగులాభములను తెలిబుచ్చునాటకములను సభలను ఏర్పాటుచేయించి భీమాయొక్క అవశ్యకతను, భీమా చేయించుటకు ముందుఎట్టి విషయములయందు జాగ్రత వహించవలసినవిషయములను గూర్చియు వాల్ పోష్టర్లు, ప్రచారపటములమూలమునను కరపత్రములవల్లను, జనులకు వెల్లడి చేయవలయును. అట్లువెల్లడించుటవలన 'భీమా' దేశమునందు వెల్లడియగుటయేగాక భీమాకంపెనీలుఅభివృద్ధిజెందగలవు. కంపెనీలవారు ఇట్టిఅవకాశము లెవ్వియు కలుగజేయకపోవుటవలననే భీమావ్యాపారము దేశమునందంత విపులముగా కొనసాగకపోవుటకు ముఖ్యకారణ

ణము. కంపెనీలవారు కుండలోనిబియ్యము కుండలో నుండి బిడ్డలు దుడ్డుపలె వుండవలె నను లోభిత్వమును విడచి ,యెన్నడు యిటువంటి ప్రచారమును దేశమందంతటను వ్యాపింపజేసిరో నాడే "భీమా" దేశమునందభివృద్ధి కాగలదని మా దృఢవిశ్వాసము.

భీమావారములు పైవిధముగ జరుపుటవలన పట్టణములందేగాక పల్లెలందుగూడా భీమాఆవశ్యకత, వానివలన జనులకు కలుగునట్టి మహోపకారము వెల్లడికాగలదు. ఏనాడు భీమాకంపెనీలవారు "పిండికొలది రొట్టె" అను విషయము జ్ఞప్తికితెచ్చుకొని ఆచరణములో పెట్టగలరో నాడే భీమాకంపెనీలు దినదినాభివృద్ధి నొందగలవని దృఢముగ నమ్మవలయును. అదియునుగాక భీమాకంపెనీలవారు ఏనాడు తమఏజంట్లు తమకన్న కంపెనీకి ఎక్కువ అప్తులని తలచి వారిసౌకర్యము నపేక్షింతురో నాడే భీమాకంపెనీలు బీదలపాలిటి కల్పతరువని చెప్పకతప్పదు.

కంపెనీలవారు ఏజంట్లకోర్కెలను తీర్చుట ముఖ్యావసరము. ఎందువలనన వారు పలువురదగ్గఱ పలువిధములైన విషయములను గ్రహింతురు. వానినన్నిటిని ఆచరణలో పెట్టిన ఆయా కంపెనీలు పలువురమనస్సులను రంజింపజేసి మంచిపేరు వ్యాపారము సంపాదింపగలవు.

అట్టి విషయముల నన్నిటిని దెలిసికొనుటకు సంవత్సరమున కొక పర్యాయము భీమావారములనియు ఏజంట్ల స్థితిగతులను విచారించి వారివారి కోరికలను తెలిసికొనుటకు దేశీయభీమాకంపెనీ ఏజంట్ల మహాసభలను యేర్పాటు చేసి ఐదుసంవత్సరముల కొకపర్యాయము గత ఐదుసంవత్సరములలో జరిగిన భీమావారముల సందర్భమునను భీమాఏజంట్ల సభలయందును జరిగిన విషయములను తర్కించి తగిన సదుపాయములతో ఐదుసంవత్సరముల కొకపర్యాయము కంపెనీలలో తగిన మార్పులను జరిపినయెడల కంపెనీలు దృఢప్రాయములై నూతనసంస్థలను ఏర్పరచుటకును కంపెనీలయందు మంచిలాభములను పొందుటకును వీలుకలుగుటయేగాక ఆచంద్రార్కము వర్ధిల్లగలవు.

# ఆదర్శప్రాయుడైన భీమాయేజంటు

(నూటఒక్కదినములపర్యంతము దినమున కొకపట్టా చొప్పున విక్రియము.)

మోటారురాజు హెన్రిఫోర్డు నామము వినని వారెవ్వరు? అతని పట్టణము డెట్రాయిట్. ఆ డెట్రాయిట్ పట్టణమున స్కాట్ జాతికి చెందిన యువకు డొకడు నివసించుచుండెను. అతని నామము ఛార్లస్ ముర్రే. అతడు ఇన్సూరెన్సు ఏజంటు.

ప్రపంచమున ఎంతమంది ఇన్సూరెన్సు ఏజంట్లులేరు? కోటానకోట్లుగా నుండిన ఇన్సూరెన్సుఏజంట్లలో అతని విషయమున ఏమైనప్రత్యేకత ఉన్నదా? ఉన్నదికావుననే అతని ప్రశంస ఇచట చేయనైనది.

డెట్రాయిట్ నందలి హెన్రిఫోర్డు మోటారుప్రపంచమున రికార్డుకొట్టినాడు. డెట్రాయిట్ నందలి ఛార్లస్ ముర్రే ఇన్సూరెన్సుప్రపంచమున ఇటీవల రికార్డుకొట్టినాడు. కొట్టి ఆదర్శప్రాయుడగు భీమాఏజంటు అయెను.

నూటఒక్కదినములు తెంపులేక ప్రతియొక్కొక్క దినమును అతడు కనీసము ఒక్కొక్కభీమాపాలసీనైన అమ్మువాడు. కనీసము ఒక భీమాపాలసీనైన దినమునకు అమ్మకుండ నూటఒక్కదినములు తెగనివ్యాపారము చేసిన ఇన్సూరెన్సుఏజంటు, ప్రపంచచరిత్రలో మఱియొకడులేడు. నూటరెండవదినమునమాత్రము అతడు భీమాపాలసీని ఒక్కదానినైన అమ్మలేకపోయినాడు.

నూటరెండవదినము వచ్చువఱకును గతించిన దినములన్నిటియందును దినమునకు కనీసము ఒకటైన భీమాపాలసీని అమ్ముచువచ్చినాడు. ఇది యెట్లు అతడు చేయగలిగినాడు? ఆ ముఖ్యవిషయమును తెలిసికొనుటయందే మన మనములు లగ్నములై యున్నవి.

తన మిత్రులలో, పరిచితులలో, బంధువులలో భీమాపట్టా కొనగలవారని తనకుతోచిన నూటయేబదిమంది నామములను పట్టికగా అతడు మొదటతయారుచేసినాడు.

పిమ్మట తనమిత్రులకు లేఖలువ్రాసినాడు, భీమాపట్టాలు కొనగలవారి నామములు తెలుపమని. కాని ఆమిత్రుల వలన కొద్దిసాయముమాత్రము వచ్చినది.

అప్పుడు వారిని తాను స్వయముగ చూచుటకు దొరకొనినాడు. ఉత్తరములకంటె ఈ పద్ధతి బాగుగ పనిచేసినది. ఒక్కొక్కరు తమకుతోచిన కొన్నికొన్ని పేర్లు సూచించిరి.

మఱునాడు చేయవలసిన పనినిగూర్చి అత డీరాత్రియే నిశ్చయమొనర్చుకొనువాడు. తన కాలమున ప్రతి ఒక్క గంటను అత డుపయోగించుకొనువాడు దినమునకు గల ఇరువదినాలుగుగంటలలో ఎనిమిదిగంటలకు తగ్గకుండను పండ్రెండుగంటలకు మించకుండను అతడు పని చేయువాడు. ఆదివారములందుగాని, సెలవుదినములందు గాని పనిచేయువాడుకాడు.

ఒకసారి అతడు ఉదయము ఆరుగంటలకే ఒకభీమా పట్టాను అమ్మగలిగెను. ఎవరికి? తనకు పాలుఅమ్మువానికి- ఎంతమొత్తమునకు? రెండువందలపౌనులకు. తాను స్నానపుదుస్తులలోనుండగా అతని కాభావము పొడచూపెను. తోడనేవచ్చి తన పాలవానికి నచ్చజెప్పి పాలసీని విక్రయించెను.

'జీవితభీమావ్యాపారమును ప్రతివాడును కొనుగోలుదారే' అని మూర్తి చెప్పును. అత డొకసారి ఒక మాన్యుఫాక్చరర్‌ను చూడ వేచియున్నకాలమున అచటి టైపిస్టున కొకనికి ఒక భీమాపట్టాను విక్రయించెను.

తాను నచ్చచెప్పుటచేత ఎన్నిపట్టాలు విక్రయింపగలిగెనో ఇతరులు చెప్పునది లెస్సగ వినుటచేతకూడ నాత డన్ని పట్టాలు విక్రయించెను. వారివారి కుటుంబ పరిస్థితులను గూర్చియు, వారివారి ఆర్థికసమస్యలను గూర్చియు తనతో సావకాశముగా చెప్పుకొననిచ్చువాడు. పిమ్మట నెమ్మదిగ వారివారికి అనువైయుండు పాలసీని సూచించి వారిచే కొనుపించువాడు.

తాను పోయినచోట తనకు చేయబడిన స్వాగతమును అత డెప్పుడు చాలసేపు ఉండిపోవుటచేత పాడుచేయలేదు. కూడినంతకాలముఉండి అప్పటికి వెడలిపోయి తిరిగి మరియొకప్పుడు వచ్చువాడు. ఇన్సూరెన్సుఏజంట్లు ఈవిషయమును తఱుచు విస్మరింతురు. తన రాకచేగాని, తనవునికిచేగాని ఎవరింటియందును ఎట్టి చీకాకుగాని చీదరగాని కలుగకుండునట్లు అతడు మిక్కిలి మెలకువ వహించువాడు.

మొదట నాతడు ఒక రైల్వేస్టేషన్‌లో టిక్కట్టు అమ్మువాడుగా నుండినాడు. విశేషమగు విక్రయము లేకుండుటచే వస్తువిక్రయరహస్యములను బోధించు పుస్తకములను, పత్రికలను కొని చదువ నారంభించెను. భీమాపట్టాల విక్రయమునకు దొరకొన నిశ్చయించెను. రెండు నిండుసంవత్సరములు ఇన్సూరెన్సువిషయకగ్రంథములను పఠించెను. వలయు జ్ఞానముకలిగినపిమ్మట రైలుటిక్కెటు అమ్ము ఉద్యోగమునకు రాజీనామా నిచ్చి ఒకానొక ఇన్సూరెన్సుకంపెనీయందు ఏజంటుగా కుదిరెను.

అతడు ఇన్సూరెన్సుఏజెంటుగా పురుషప్రయత్నముచేతనే జయమందెను. తాను చేయవలసిన పనికి గ్రంథపఠనముచే నాతడు లెస్సగ తయారయ్యెను. తయారై కార్యరంగమున ప్రవేశించి అతడు ఇన్సూరెన్సువిక్రయమును హుటాహుటిగా గావించెను.

ప్రతి ఇన్సూరెన్సుఏజెంటును పొంద ఆశింపదగు నొక ఆదర్శమును అతడు ఏర్పఱచెను. దినమునకు కనీసము ఒక్కొక్క పట్టాచొప్పున నూటఒక్కదినముల వఱకు తెగని ఇన్సూరెన్సువిక్రయము.

'ఆంధ్రభూమి' నుండి.





## కంపెనీవిషయములు
(Company Notes)

# ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

## (Oriental Life Office)

ఈ కంపెనీయొక్క 1935 సం॥రం వార్షికపు రిపోర్టు ప్రకటించారు. చాల అద్భుతముగ నున్నది. శ్రీ తిరుపతి వెంకటేశ్వర్ల డిబ్బీలో వేయబడే ధనముయొక్క రాబడిఎంతో అంతులేక సంతతాభివృద్ధికరముగ నుండునో అదేవిధముగ యీ కంపెనీయొక్క రాబడికి అభివృద్ధికి మితము లేదు. ఈ కంపెనీయొక్క ప్రతివివరాన్ని గూర్చి వ్రాయాలంటే ఎన్నిపుటలైననుచాలవు. కావున ప్రధానవిషయాలను యిచ్చటవివరిస్తూయున్నాము. 1935 సం॥రంలో రు 8,89,89,149/-లు మొత్తమునకు 48,858 భీమాపట్టాలను జారీచేసియుండిరి. 1894 సం॥లో కంటె 1935 సంవత్సరములో రు1,27,46,388/- లు భీమా మొత్తమునకు 6,480 భీమా పట్టాలను అధికముగా జారీచేసియుండిరి. సంవత్సరాంతమునకు కంపెనీ మొత్తము మీద రు59,25,22,038/-లు భీమావ్యాపారములు అమలులోనున్నవి.

గతసాలులోను 48,00,889-14-4 లు మరణ హక్కులకును రు 56,36,590--129 లు వాయిదాలు పూర్తియై పండిపోయిన పట్టాలహక్కులకును క్లెయిములు ఏర్పడెను. కంపెనీ పట్టాదార్లలో చనిపొయ్యే పట్టాదార్లసంఖ్య వేసుకున్న అంచనాకంటె చాలతక్కువగనే మరణములు వచ్చుచుండెను. ఈ కంపెనీ వ్యాపారము పెరుగుచున్న కొలది మొత్తపుఖర్చులరేటు తగ్గుచున్నది 1934 సం॥ లో కంటె యీసాలులో ఖర్చులను చాలతక్కువగనే చేసియుండిరి. నూటికి 22.4 వంతులుకంటె ఎక్కువఖర్చులు చేసియుండలేదు. 1935 లో రు3,49,16,412/=లు ఆదాయము వచ్చియుండెను. ఈ మొత్తములో రు 2,01,42,763 లు ఖర్చుచేసి యుండిరి. ఈ సంవత్సరములో రాబడిలో ఖర్చులు పోను రు1,47,73,648-4-2లు నికరాదాయము మిగిలియుండెను. 1935 సంవత్సరాంతము యీ కంపెనీ రు 17,62,73,814/- లు విలువ గల ఆస్తినిగలిగి యుండెను. కంపెనీ పెట్టుబళ్లపై సాలు 1కి నూటికి 4.96 వంతులు చొ॥న వడ్డీరేటు గిట్టుబాటుఅయ్యెను. కంపెనీయొక్క నిధులన్నియు భద్రమైన పెట్టుబళ్లలో నిల్వచేయబడెను. షేరుహోల్డరులకు షేరు 1 కి (యిన్‌కంటాక్సులేని) రు 125/-లు చొ॥ లాభములను పంచిరి.

ఈ ఓరియంటల్ కంపెనీ బ్రిటిషు సామ్రాజ్యములోనున్న భీమాకంపెనీలలో పదియవ స్థానమును ఆక్రమించుచున్నదని తెల్పుటకు సంతసిల్లుచున్నాము. ఈ కంపెనీ వ్యాపారము సర్వతోముఖాభివృద్ధిని కలిగియున్నది.

ఆపత్సమయంబులలో సామాన్య జనులకు ఆర్థికరక్షణ యొసంగుచు ఈ కంపెనీ హిందూదేశ ఆర్థికాభివృద్ధికి మిగుల తోడ్పడుచున్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును. విశాఖపట్టణపు బ్రాంచి సెక్రిటరీ శ్రీయుత పోలిసెట్టి హనుమయ్యగుప్తగారును, రాజమండ్రి ఆర్గనైజింగు యిన్‌స్పెక్టరు శ్రీయుత కె. నారాయణస్వామిగారును, గుంటూరు యిన్‌స్పెక్టరు శ్రీయుత పాతూరి సూర్యనారాయణగారును ఆంధ్రదేశములో యీ కంపెనీవారి వ్యాపారాభివృద్ధికి ముఖ్యకారకులు.

# ది డాన్ ఆఫ్ యిండియా లైఫ్ యిన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్ - పూనా

**The Dawn of India Insurance Company Limited, Poona.**

ఈ కంపెనీవారియొక్క వివిధ భీమాపద్ధతులలో గృహనిర్మాణపద్ధతిని గూర్చి పూర్తి వివరములు "యీ భీమాపత్రిక"యొక్క యీ సంవత్సరపు ఉగాదిసంచిక (Annual Number)లో ప్రకటించియున్నాము. ఈ కంపెనీవారి నిబంధనావళిలోని పన్నెండవపట్టీ చాల గమనింపదగినది. ఈ పద్ధతిక్రింద వృద్ధాప్యములో యిబ్బందిలేకుండ పించను వచ్చునట్లును, ఒకవేళ భీమాపట్టాదారు చనిపోయినయెడల కుటుంబమునకు తగు ఆర్థికరక్షణయు ఒసంగును. ఈపద్ధతి యీ కంపెనీవారిచే అమలులోనికి తీసుకొని రాబడిన ఒక నూతనపద్ధతి. యీపద్ధతిలో పట్టాదారులకు మిక్కిలి సౌకర్యముగలదు. వృద్ధాప్యములో ప్రతినెల ఒకనియామకమైన మొత్తము గ్యారంటీగావచ్చు ఏర్పాటుగలదు. వృద్ధాప్యములో సర్కారు ఉద్యోగస్థులకు ప్రతినెల ఎట్లు పించను వచ్చుచుండునో అదేవిధముగ యీ పద్ధతిలో సర్కారు ఉద్యోగస్థులుకాని వారుకూడ తమ వృద్ధాప్యములో ప్రతినెల పించను వచ్చునట్లు ఏర్పాటు చేసుకొనవచ్చును.

ఉదాహరణము:—ముప్పది (30) సంవత్సరములు వయస్సుగల యువకుడు తనకు వృద్ధాప్యములో 55 వ ఏటనుండి వరుసగా 15 సంవత్సరములు ప్రతినెల రు 50 లు ఫింఛన్ పొందవలెనంటే సాలు 1 కి రు 275-10-0 చొ॥న 25 సంవత్సరములుగాని యీలోపుగ మరణము సంభవించునంతవరకుగాని ప్రీమియం చెల్లింపవలెను. తాను బ్రతికియుంటే తన 55 వ యేట నుండి 15 సంవత్సరములు యీ పింఛను యిచ్చెదరు. పదిహేను సంవత్సరములు పింఛనుతీసుకోకుండ చనిపోతే 15 సంవత్సరములలో మిగిలిన ఫింఛన్ వాయిదాలు ప్రతినెల తన వారసులకు కుటుంబఖర్చుటకు యిబ్బందిలేకుండ యిచ్చివేయుదురు. అసలు పింఛన్ వయస్సునకు రాకుండ 55 వ ఏటలోపల చనిపోయినను చనిపోయినప్పటినుండి తనకుటుంబము వారికి నెల 1కి రు 50 లు చొ॥న 15 సం॥లు మాత్రమే వరుసగా పింఛనుయిచ్చుచుందురు.

యౌవనంలో సంపాదించు ధనముగతి వృద్ధాప్యములో ఏమగునో అని భయపడువారు

యీ పద్ధతిక్రింద భీమాలాభములను పొందుట చాల యుత్తమము. ఈ పద్ధతిక్రింద భీమాచేయించుకొన్నవారు వృద్ధాప్యములో తన బంధువులపై ఆధారపడియుండ నవసరములేదు. సరండరు వాల్యూ, పెయిడప్పు పాలసీ, నాన్ ఫర్ ఫీచరు మొదలగు సౌకర్యవిషయములలో యితర పద్ధతులక్రింద భీమాచేసిన పట్టాలవలెనే యీపద్ధతిక్రింద భీమాచేసిన పట్టాలకు గూడ గలవు. వీరి 17 వ పట్టాయగు ది ప్రీమియం యిన్సూరెన్సు బాండ్ లైఫ్ పాలసీ (Tbe Premium Insurance Bond Life Policy) పద్ధతిలోని సౌకర్యములుగూడ చాల గమనింపదగినవి. ఇందులో యావజ్జీవిత, ఎండోమెంటు భీమాపద్ధతులు కలసియున్నవి. ఈ పద్ధతివలన తనకే గాక తన కుటుంబమునకు గూడ తక్కువ ప్రీమియంతో ఎక్కువ ఆర్థిరక్షణను పొందవచ్చును. పూర్తి వివరములకు కంపెనీవారికి వ్రాసిన బడయగలరు.

---

# వి మా వా ణి జ్య

## (జన్మదినోత్సవ సంచిక)

## Vima Vanijya - (Birthday Number)

మైసూరు మహారాజావారి జన్మదినోత్సవ సందర్భమున ప్రకటింపబడిన విమావాణిజ్య పత్రికవారి వార్షికసంచికను కృతజ్ఞతతో నందుకొంటిమి. మహారాజావారి పుట్టుకదినముతో సమానముగ యీ పత్రికయొక్క రెండవ సంవత్సరపు పుట్టినదినము యీ అపూర్వ ప్రకటనతో ప్రారంభమగుట కడుసంతసముగానున్నది. ఇందు మైసూరు మహారాజుగారి యొక్కయు దివాన్ సర్ మిర్జాయిస్మైల్, సర్ సి.వి. రామన్, సర్ యం. విశ్వేశ్వరయ్య మొదలగు ప్రముఖులనేకులయొక్క చిత్రములు గలవు. వీరు అందరును భీమావ్యాపారాభిమానులే. వీరు అందరును యీ సంచిక ప్రకటన సందర్భమున పత్రికాధిపతి శ్రీయుత జే. వి. దొడ్డ వీరప్ప గారికి పంపిన భీమాసందేశములు చాలా గమనింపదగినవై యున్నవి. ఈ సందేశములన్నియు శ్రీయుత దొడ్డ వీరప్పగారికేగాక భీమా వ్యాపాగాభిమానులందరికిని ఉత్సాహమునుపురిగొల్పి భీమా వ్యాపారాభిముఖులుగ జేయుననుట కెంతమాత్రమును సందేహములేదు. ఇందు శ్రీయుతులు సి. రాజగోపాలాచారి సర్ యమ్. విశ్వేశ్వరయ్య, పండిత్ తారానాధ్ జీ, శ్రీయుత శనివారపు సుబ్బారావుగారు మొదలగు ప్రముఖులనేకులు వ్రాసిన మంచి వ్యాసములు గలవు. ఈ వ్యాసములలోని విషయముల నుండి చాలా నూతన విషయముల నెన్నియో తెలుసుకొనుటకు వీలుగలదు. ఈ జన్మదినోత్సవ సంచికను ప్రకటించుటలో శ్రీయుత జే. వి. దొడ్డ వీరప్పగారు చాలా శ్రమచేసియుండిరి. వీరి కార్యదీక్ష అద్భుతము. ఈ పత్రికయొక్క అచ్చుపని ప్రకటన చాల అందముగానున్నవి. ఈ సంచిక భీమాకంపెనీ ఏజంట్లకును, భీమా అభిమానులకును కంపెనీలకును చాల ఉపయోగకరముగ నుండును.

ఈ ప్రకటన సందర్భమున యీ పత్రికా సంపాదకులగు శ్రీయుత జె. వి. దొడ్డ వీరప్ప గారిని మే మెంతయు అభినందించుచున్నాము.

---

# భీమా సమాచారములు

## (Insurance News)

యంపైర్ ఆఫ్ యిండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ హెడ్డాఫీసు మేనేజర్లగు ఆలంబరూచా అండ్ కంపెనీ వారు యీ నెల 29 వ తేదీని మదరాసునకు వచ్చెదరని తెలియుచున్నది.

*　　*　　*　　*

కలకత్తా నేషనల్ యిన్స్యూరెన్సు కంపెనీ తరఫున కృష్ణా, గుంటూరు జిల్లాలలో పనిచేయుటకు బెజవాడ హెలుమకాంగా యిదివరలో యీ కంపెనీ తరఫున తెనాలిలో పనిచేయుచున్న శ్రీయుత యం. వి. రావుగారిని ఆర్గనైజరుగా నేర్పాటు చేసియున్నారు.

*　　*　　*　　*

డిల్లీ - వీనస్ అస్యూరెన్సు కంపెనీ జనరల్ మేనేజరు శ్రీయుత బొమ్మలూరు నరసింహంగారు కంపెనీ తరఫున ఆంధ్రదేశములో పర్యటన మొనర్చుటకు యీ నెలాఖరున బెజవాడ మదరాసు నగరములకు వచ్చెదరని తెలియుచున్నది.

*　　*　　*　　*

బెజవాడలో నూతనముగ స్థాపింపబడిన ట్రాపికల్ యిన్స్యూరెన్సు కంపెనీ ఆర్గనైజింగు ఆఫీసును పరీక్షించుటకు సదరు కంపెనీ మదరాసు బ్రాంచి సెక్రటరీ శ్రీయుత భక్తవత్సలనాయుడుగారు యీ నెల 30 వ తేదీని బెజవాడకు వచ్చెదరని తెలియుచున్నది.

ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజంట్లసంఘముయొక్క సబ్‌కమిటీవారు గత మే నెల 2 వ తేదీని బెజవాడ పట్టణమున సమావేశమై సదరు సంఘము నిమిత్తము చిత్తుచట్ట నిబంధలను (Draft Constitution Rules) తయారుచేసి సదరు సంఘముయొక్క మహాజనసభవారి పరిష్కారమునకు నివేదించియున్నారు.

*　　*　　*　　*

బెంగుళూరులోనున్న మైసూరు యిన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్ వారు తమ మొదటి పాలసీ హోల్డరును బెంగుళూరు జిల్లా అనెకాల్ తాలూకా అసిస్టెంటు కమీషనరునగు శ్రీయుత హుమయూన్ మీర్జాగారి గౌరవార్థము అనేకాల్ గ్రామమున గత మే నెల 28 తేదీని గం 5 లకు అల్పాహారవిందు నేర్పాటు చేసిరి. సదరు విందునకు శ్రీయుతులు సర్. సి. వి. రామన్, డి. వి. గుండప్ప, వి. వెంకటప్ప మొదలగు ప్రముఖులనేకులు విచ్చేసిరి. మైసూరు యిన్స్యూరెన్సు కంపెనీ డైరక్టర్లందరును యీవిందునకు వచ్చియుండిరి. సర్. సి. వి. రామన్, గుండప్ప, పి. శివశంకర్, జె. వి. దొడ్డ వీరప్పగార్లు ఫలహారానంతరము, భీమా విషయములను గూర్చి ఉపన్యసించిరి హుమయూన్ మీర్జాగారు అవకాశమునకు తగినట్లు ప్రత్యుత్తర మొసగిరి.



# Draft Constitution of The Andhra Desa Indian Insurance Agents' Association,

## BEZWADA.

### MEMORANDUM OF ASSOCIATION

1. Name :—This association shall be called "The Andhra Desa Indian Insurance Agents' Association."

2 The Registered Office of the Association shall be situated at Bezwada.

3. The objects for which the Association is established are:

(a) To provide a social and educational centre for persons interested in Insurance by diffusion of useful knowledge in Insurance and the maintenance of a library and a reading room for general use,

(b) To foster and develop feelings of fellowship and friendship and encourage mutual help and goodwill amongst Insurance workers,

(c) To accept any gift, donation, bequest, endowment or subscription from the public,

(d) To collect and dessiminate statistical and other information relating to Insurance and promote proper understanding of the Insurance problems of the day by organising Discussions, Lectures, Conferences, Exhibitions, Correspondence and Publications,

(e) To assist or co-operate with Local or Central Governments, or any other authority or public or private bodies in any matter necessary for the protection and growth of Insurance in India,

(f) To make representation to or communicate with the aforesaid bodies or authorities on any question affecting Insurance in India.

(g) To deal with my monies at the disposal of the Association in such manner, as may be from time to time, determined by the Executive Committee to further or fulfil the objects of the Association,

(h) To join, affiliate or establish connection with any other body or bodies whose objects are similar to those of the Association,

(i) And generally to do such other things as may be conducive to the promotion of the cause of Indian Insurance,

(j) To organise and maintain Agents and their family protection funds,

(k) To represent, plead and mediate on behalf of an Agent for any dispute or injustice done to the Insurance Agent by the company he represents and take such other steps as deemed necessary in his course,

(l) To organise co-operative Insurance Field-workers Associations.

### RULES & REGULATIONS

1. Any person over the age of 18 (Eighteen) who is connected with an Insurance Institution whose Head office is situated in India, as an Agent, or Chief Agent or Organiser, Managing Agent, Secretaries of Branches or Manager, shall be eligible to become as an ordinary member of the Association.

2. There shall be four classes of members namely (a) Ordinary Members, (b) Associate Members, (c) Life Members and (d) Special Members.

3. Persons who or interested in Indian Insurance but not actively associated with the working of an Insurance Office ( e.g., Medical Officers, Auditors of Insurance Companies and Insurance Journalists etc ) may be admitted by the Executive Committee as Associate Members. Persons associated with an India Insurance Insti-

tution whose Branch Office is situated outside India may also be taken in as Associate Members by the Executive Committee.

The Associate Members shall have all the rights and privileges of ordinary members except the right to vote at the meeting of the Association and to be elected to its Executive Committee.

4. Any Indian Insurance Company complying with the Provisions of Insurance Companies act in force for the time being may be admitted as a Special Member, each such company being represented for the purpose of exercising the rights and privileges of membership by the Chief officer of the Company or by any other officer or representative of the Company duly nominated as such by the Head Office in writing.

Ordinary members may exercise the rights of such Special Members in representative capacity without in any way affecting their rights as ordinary members.

5. An applicant for membership must be proposed and seconded by two ordinary members of the Association and his name submitted to the Executive Committee for approval, subject to the right of appeal to the General Body. The Executive Committee reserves the right of admitting or refusing members without assigning the reason for the same.

6. Membership subscription for Ordinary and Associate Members shall be as follows :—

a. For Officers of Insurance offices Rs. 5/- per annum.

Chief Agents, Branch Officials & Organisers, Rs. 3/- per annum.

b. Field workers and other insurance workers not included in "A" Rs. 2/- per annum.

c. Insurance workers living permanently in maffusil not included in (A) and ( i. e. not within municipal limits of Bezwada) Rs. 1/ per annum.

d. Any ordinary member of the Association may be elected by the Executive Committee a Life Member of the Association on payment of Rs. 100/ (Rupees one hundred only) to commute all future annual subscriptions. Such Life Members will continue to exercise the rights of ordinary members.

e. Every company shall become a special Member by payment of Rs. 25/ (Rupees Twenty Five only) annually to the Association.

Within a month from the date of selection every member shall have to pay the annual subscription to the Association failing which the selection will lapse. The annual subscription whenever be it paid shall cover the period from previous 1st of January to the following 31st December.

8. (a) No member shall be entitled to vote at any General Meeting whose subscription shall have been in arrear on the day just previous to the date on which the General Meeting is held.

(b) Any member whose Annual subscription shall have been in arrear for a period extending over six months from the commencement of the year shall cease to be a member and shall not be eligible for re-admission until he has paid up the amount of his subscription in arrear. But the executive committee may for special reasons extend the period up to another 3 ( three ) months.

**Sub-committee.**

9. The General Meeting or the Executive Committee may form such Sub-committees and appoint the Members thereof either from among the

Members of the Executive Committee or from among the other Members of the Association as may be deemed necessary from time to time; each Sub-Committee to consist of not less than 3 and not more than 7 Members, including the President who shall be Ex-officio Member of all Sub-Committees. Such Sub-Committee shall function only till the next Annual General Meeting but their term may be extended by the General Meeting.

10. The management of the Association shall vest in the Executive Committee consisting of the following members.—

(a) Eight members from Agents residing in Municipal Towns.

(b) Four members from Agents residing outside (other than) Municipal Towns.

N. B: These above Twelve members shall be elected from among the ordinary Agents.

(c) Three members to be elected from among the Chief Agents and Organisers and Special Agents.

(d) One member to be elected from amongst the Companies and Branch Secretaries and Managers.

(e) Two members to be elected from amongst the affiliated bodies and institutions or Associations, provided not more than one member is taken from each such body or Institutions or Associations.

(f) Three members to be co-opted by the aforesaid elected members from amongst the General Public who are interested in Insurance.

(g) If the prescribed number of members are not forthcoming the Executive Committee will have the power to fill in the vacancies by co-option from any class of members they think proper.

(h) The Executive Committee shall consist of the following office bearers.

1. President, 2. Secretary, 3. Treasurer.

11. The members of the Executive Committee will hold office till the next annual General Meeting. Interim vacancies occuring in the Executive committee may be filled up by co-option.

12. All the meetings of the Association and its Executive Committee shall be convened by the Secretary and in his absence by any person empowered by the President, or at the written request of Five Executive Committee members or 10 ordinary members. Fifteen members shall constitute the quorum at a General Meeting and five at a meeting of the Executive Committee.

**Circular Minute.**

13. Urgent business at any time before the Executive Committee or any of the Sub-Committees may be disposed of by Circular Minute unless any two Members thereof call for a meeting to dispose of the business.

14. The General Body shall meet at least once in a year and the Executive Committee at least once in three months. The Budget and the Balance sheet shall be approved by the General Body.

**Financial Year.**

15. The financial year of the Association shall be from 1st January to 31st December, and the Annual Statement of accounts and balance sheet shall, as soon, after the close of the year, as possible, be submitted by the Secretary to the Executive Committee, after audit by a qualified Auditor, prior to submission to the Annual General Meeting of the Association to be held as far as practicable in March or April of each year.

# యునైటెడ్ ఇండియా లైఫ్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

మదరాసు — స్థాపితము 1906.

| | | | | |
|---|---|---|---|---|
| అమలులోనున్న పట్టాలు | ... | రు | 3 కోట్లు | మించెను |
| మొత్తపు ఆస్తి | ... | రు | 68 లక్షలు | ,, |
| సాలీనా ఆదాయము | ... | రు | 18 లక్షలు | ,, |

కంపెనీలో ఎన్నదగిన కొన్ని ముఖ్యవిషయములు.

కంపెనీఆస్తి భద్రముగా పెట్టుబడి చేయబడెను. హక్కులను పరిష్కరించుటలో చూపబడు త్వరితము, న్యాయము, క్లుప్తముగ చేయబడు ఖర్చులు, తృప్తికరమగు బోనస్సులతోకూడ భరింపదగిన ప్రీమియము రేట్లు, కంపెనీ వ్యవహారములలో పట్టాదారులయెడ చూపబడు త్వరితము, ఆదరణ.

వివరములకు :—

M. K. SRINIVASAN,
Managing Director,
United India Assurance Buildings,
Sambhudos Street, MADRAS.

or

వి. యల్. శాస్త్రి, బి. ఎ.,
మేనేజరు, ఆంధ్ర బ్రాంచి,
బెజవాడ.

---

స్తన్యమే పసిబిడ్డలకు సర్వోత్తమమయిన ఆహారము
పసిబిడ్డలకు తన తల్లిపాలకు మించిన ఆహారములేదు.

ఆయుర్వేదభూషణ
నోరి రామశాస్త్రిులు, ఎ. కె., ఏ. సి., వారి

## ● క్షీరవర్ధని ●

చంటిపిల్లల తల్లులకు కావలసినంత చనుబాలను ఉత్పత్తిచేయగలదు. అనేక వేలమంది వాడి గుణమును కనిపెట్టినారు. ఒకసారి పరీక్షింపుడు

వెల బుడ్డి 1 కి రు 2—0—0
పోష్టుఖర్చులు ప్రత్యేకము

ఆయుర్వేదభూషణ,
నోరి రామశాస్త్రి, ఏ. కె., ఏ. సి.,
ఆయుర్వేదనిలయము, బెజవాడ.

---

ఇప్పటి కాలపు చదువరులకు మార్గము

## ది ఆంధ్ర కాలేజి ఆఫ్ కామర్సు, రాజమండ్రి.

వర్తకపు చదువువల్లనే యిక మానవజీవితానికి మార్గం అని గ్రహిస్తే R. A. (ఇండియా గవర్నమెంటు పరీక్ష) D. Com (ఇండియన్ మర్చంటు ఛాంబరు పరీక్ష) A. I. C. C. (లండను ఇన్సూరెన్సు పరీక్ష) మున్నగు వాటిలో తయారుకావాలి. వీటివల్ల ఫలితాలు: బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, ఫ్యాక్టరీలు, పెద్దపెద్ద వ్యాపార సంస్థలలో పనిచేయుటకుగాని లేక స్వంతంగా వ్యాపారం చేసుకొనుటకు తగిన అవకాశములుగాని చిక్కును.

వివరములకు వ్రాయుడు :—

D. K. ROW, B. A., G. D. A., R. A.,
ప్రిన్సిపాల్.

# విజయలక్ష్మి జనరల్ అస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్డాఫీసు :— **మదరాసు.**

## వెంటనే కావలెను

ఏజంట్లు ఆంధ్రజిల్లాలలో ముఖ్యమైన పట్టణములందు సమర్థతతో మంచి వ్యాపారము సంపాదింపగలిగినట్టి గొప్ప కుటుంబములోని మంచి పలుకుబడిగల పెద్దమనుష్యులకు ఉత్తరోత్తర మంచిఅవకాశములును, మంచి ప్రతిఫలముతోగూడిన వసతులును గలుగ జేయబడును.

1. ధారాళమైన ప్రతిఫలము. 2. ఉద్యోగశాశ్వతత్వము. 3. వంశపారంపర్యా రెన్యూయల్ కమీషన్. 4. ప్రీమియములు చెల్లింపనక్కర లేకయే జీవిత భీమాపట్టా. 5. ప్రయాణ ఖర్చుల సౌకర్యములు. వివరములకు దయచేసి దగ్గిఱలోనున్న ప్రతినిధుల కొగరికైనను వ్రాయుడు.

1. శ్రీయుత పి. వీరభద్రస్వామిగారు, బి. ఏ. మునిసిపల్ చైర్మన్ అండ్ బ్రాంచి మేనేజరు విజయనగరం. 2 శ్రీయుత వి. వి. ఆర్. చౌదరిగారు బారట్లా - బ్రాంచి మేనేజరు, బెజవాడ. 3. శ్రీయుత డి. అశ్వద్ధరావుగారు, ఆర్గనైజరు, బళ్లారి. 4. శ్రీయుత బి. సింహాచలంగారు, చీఫ్ ఏజంటు, విశాఖపట్నం. లేక హెడ్డాఫీసుకు మదరాసు.

[ Vijayalakshmi General Assurance ]

---

నవీనపద్ధతి! ప్రత్యక్ష నిదర్శనం!

### అత్యద్భుత జాతక ఫలితములు.

మహారాజులు, నవాబులు, కలెక్టర్లు, జమీందార్లు, దొరలు దొరసానులు బహుమతులు, యోగ్యతాపత్రము లొసంగినారు. కళత్రసంతానభావములు, స్త్రీ జాతకములలో విశేషానుభవము గలదు. జననకాలం, తిథి, వారం, నక్షత్రం, జనన స్థలం వ్రాసి పంపవలెను.

ఒక సం॥నకు విదశాఫలములు, రెండు సం॥ ముఖ్యాంశము, స్వభావము రు. 2-0-0

ఒకదశకు భుక్తిఫలములు 6-0-0

జాతకం లేనివారికి సాంఖ్యశాస్త్రప్రకారమున్ను, రేఖాశాస్త్ర ప్రకారమున్ను వ్రాయుటకు ఒక సం॥ ఫలితములు, స్వభావము, ముఖ్యాంశములు. రు. 3-0-0.

12 సంఖ్యలు, హస్తముద్ర నకలు, పూర్తి నామము వ్రాసిపంపవలెను. (పోస్టేజి ప్రత్యేకం.)

జ్యోతిషవిద్వాన్ ఇవటూరి షణ్ముఖరావు.

మారిస్‌పేట, తెనాలి, గుంటూరు జిల్లా.

---

జర్మన్ విశ్వవిద్యాలయమునకై యాకర్షింపబడిన

## గానకళా చంద్రిక

టెక్నికల్ పరీక్షార్థుల కత్యంతోపయుక్తమై ప్రభుత్వామోదమునొందిన గొప్ప సంగీత లక్షణ గ్రంథము.

400 పుటలు రు 2 లు.

గ్రంథకర్త:

అరిపిరాల సత్యనారాయణమూర్తి,

గాంధినగర్ - - బెజవాడ.

దిగవల్లి వేంకటశివరావుచే రచియింపబడిన ఇతరగ్రంథములు

# సహకారవస్తు నిలయోద్యమము

గ్రంథాలయములం దుంచుటకు మదాసు టెక్స్టుబుక్కు—కమిటీవారు ఆమోదించినారు

( ఫోర్టుసెంట్ జార్జి గెజెట్ 16-4-35, పుట 256 )

ఇది సహకారశాస్త్రమును దేశీయ దేశాంతర సహకారోద్యమమును అందుకు సంబంధించిన సమస్యలను విపులముగా చర్చించు ఉత్తమగ్రంథము. రాక్డేలుసహకారోద్యమచరిత్ర, సహకారోత్పత్తి, కృషి, పరిశ్రమ, వ్యాపారములు, ప్రజారోగ్యము విద్యనభివృద్ధిచేయగల సహకారపద్ధతులు, భారతదేశ ప్రజాజీవనము, పారిశ్రామికాభివృద్ధి గ్రామపునర్నిర్మాణములను గూర్చిన ప్రకరణములు నిందుగలవు. ప్రజల ఆర్థిక స్థితిగతులను ప్రభుత్వాదాయ వ్యయ పద్ధతులను ప్రపంచములోని ఇతరదేశములవానితో పోల్చిచూపు స్థితిగతి లెక్కలును మనదుస్థితినితొలగించు మార్గములను సూచించు వ్యాఖ్యానములును గలవు. ఇది కృష్ణాజిల్లా కో-అపరేటివ్ ఫెడరేషనుచే ప్రకటింపబడినది. 260 పుటలు

సాదాబైండు వెల రు 1—0—0 క్యాలికోబైండు వెల రు 1—4—0

# అధినివేశ స్వరాజ్యము

విజ్ఞానచంద్రికలోని 40 వ గ్రంథము.

బ్రిటీషుసామ్రాజ్య స్వరూపస్వభావములు, స్వరాజ్యప్రయోజనము, అధినివేశస్వరాజ్యచరిత్ర, అధినివేశ స్వరాజ్యసమస్యలు, ఫెడరలు రాజ్యాంగవిధానము, ప్రజాప్రభుత్వ ప్రాతినిధ్యపద్ధతులు, కెనడా డొమినియను, ఆస్ట్రేలియా కామన్వెల్తు, ఐరిషు ఫ్రీస్టేటు, ఆంగ్లరాజ్యాంగములనుగూర్చి చర్చించు ఉత్తమ రాజ్యాంగ శాస్త్రగ్రంథము. నూతన ఇండియా రాజ్యాంగ చట్టములోని మంచిచెడ్డలు గ్రహించుట కిది తోడ్పడగలదు. వివిధదేశ ప్రజల ఆర్థికస్థితిగతులు ప్రభుత్వాదాయ వ్యయపద్ధతులు పోల్చి జూపు స్థితిగతిలెక్కల జాబితాలు 36 కలవు. ఇది "అధినివేశ స్వరాజ్యము, ప్రపంచ రాజకీయములనుగూర్చిన ఉత్తమ గ్రంథ"మని హిందూపత్రిక ప్రశంసించినది. దీని ప్రాశస్త్యమును గూర్చి ఆంధ్రపత్రిక 2-9-33 తేదీన సంపాదకీయ వ్యాసమును ప్రచురించినది. 250 పుటలు. వెల రు. 0-12-0.

# దక్షిణాఫ్రికా

విజ్ఞానచంద్రికా గ్రంథమాలలోని 36 వ గ్రంథము.

దేశచరిత్ర, రాజ్యాంగచరిత్ర, భారతీయులబాధలు, గాంధిమహాత్మునిసత్యాగ్రహచరిత్రము నిందుగలవు.

అనేకపటములు. కాలికోబైండు — 432 పుటలు. వెల రు 2—0—0

# భారతదేశ స్థితిగతులు

వివిధదేశప్రజల ఆర్థికపరిస్థితులు, ప్రభుత్వాదాయ వ్యయవిధానములు, మనదుస్థితిని ఇతరదేశముల యౌన్నత్యమును పోల్చిచూపు స్థితిగతిలెక్కలు. 72 పుటలు. వెల రు 0—2—0

## ఆంగ్ల రాజ్యాంగము 30 పుటలు వెల రు 0-1-0

## అంకుల్‌టామ్ కథ "అంకుల్‌టామ్సుకాబిన్" అను సుప్రసిద్ధ నవలకు తెలుగు. 34 పుటలు వెల రు 0-1-0

---

దొరుకువారు :-దిగవల్లి వేంకటశివరావు బి.ఏ., బి. యల్., బెజవాడ.

Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.